# కురంగికిరాతము.



వేపకొమ్మ ఆదిశేషయ్య,
కృతికర్త.

 వెల ౦-౮-౦.

"దంతియడుగులోనఁ దక్కిన జంతు చ
యంబునడుగులెల్ల నడఁగియుండు
నట్లు ధర్మకోటు లన్నియు లోనగు
నిద్ధగుణ, యహింస కింత నిజము"

భారతము.

ప్రథమ ముద్రణము,
౧౦౦౦ ప్రతులు.

ప్రభాతముద్రణాలయము,
నెల్లూరు.

# కృతజ్ఞత

శ్రీరమ్యున్ బెజవాడవంశ్యు రసిక
శ్రేష్ఠాగ్రణిన్ రామచం
ద్రారెడ్డిప్రభు నస్మదీయకృతిము
ద్రాద్రవ్యదాతన్ మహో
దారున్ మద్రపురస్థ శాసనసభా
ధ్యక్షున్ మహైశ్వర్య వి
స్తారారోగ్య చిరాయు రున్నతునిగా
సర్వేశ్వరుం డేలుతన్!



# విజ్ఞప్తి



సుమారు పదునైదేండ్లనాఁడు నామేనమామ కీ. శే. పిడూరు శేషయ్యగారును నేనును నెల్లూరు మండలములోని మనుబోలునుండి స్వగ్రామమగు దేవరవేమూరికిఁ బోవుచుండఁగా దారిలోనున్న చిట్టడవిలో మాకొక కృష్ణసారము దృగ్గోచరమయ్యెను. దానిఁ గన్నంత శేషయ్యగారేవో కొన్ని శ్లోకములు చదివి తదీయార్థమును నాకు సంగ్రహముగాఁ జెప్పిరి. వారుచెప్పిన తెఱంగున నయ్యర్థము నాకు హృదయంగమంబగుటయేకాక, అది మనస్సున నాటుకొని కొన్నియేండ్లకు నన్నొక ఖండకావ్యరచనకుఁ బ్రేరించెను. అదికొండొక వ్రాసి మూలఁబడవైచి యావిషయమే మఱచిపోయితినిగాని అయ్యసంపూర్ణరచనను గాంచిన నామిత్రులు కొందఱు కృతిని బూర్తిచేయుమని మిక్కిలి ప్రోత్సహించిరి. వారి కోరికమేరకు దీని మూఁడేండ్లక్రిందఁ బూర్తిచేసి ఒకరిద్దరు పెద్దలకుఁ జూపఁగా నది ముద్రణార్హమని వారొత్తిచెప్పిరి. కావున ఆనాఁటిరచనమును యథామతి సంస్కరించి నేఁడు ప్రకటించుచున్నాఁడ. గ్రంథముఁ బూర్తిసేయుటకు మున్ను పూర్వోక్త శ్లోకముల సేకరించుటకు యత్నించితినిగాని అవి నాకుపల

భ్రమలుకావయ్యె. నిన్న మొన్న ఒకరసజ్ఞునిముఖమున మరల విని వాని నీక్రిందఁ బొందుపఱిచితిని. ఈశ్లోకములు ముందే నాకు దొరకియున్న,నీగ్రంథములోని కథాంశము మఱియొకవిధముగా మాఱియుండునేమో!

ఈగ్రంథోద్దేశ్యము సర్వజనాదరణీయమగు నహింసా ధర్మపరమనుట పాఠకులకు విశదము. విద్యాశాఖాధికారు లీచిఱుకబ్బమును బాఠశాలలయందు విద్యార్థులకుఁ బాఠ్య గ్రంథముగా నొనర్చి నా యీసదుద్యమమునకుఁదోడ్పడ మిక్కిలి ప్రార్థించుచున్నాను.

విద్వజ్జను లీరచనయందలి నెరసుల సరకుగొనక గుణలేశమును గ్రహించి నన్నుఁ గృతార్థుంజేయుదురుగాక.

ఇట్లు
విద్వద్విధేయుఁడు,
వే. ఆదిశేషయ్య.

# కురఙ్గీ పఞ్చకమ్.



అయికురఙ్గి తపోవన విభ్రమా
దుపగతాసి కిరాతపురీ మిమామ్
ఇహతుపశ్యసి దారయ మారయ
గ్రస పిబేతి శుకానపి జల్పతః

రజ్జ్వాదిశః పరివృతా సలిలం విషాక్తం
ఖాతామహీ హుతభుజాజ్వలితమ్ వనాన్తమ్
వ్యాధాః పదాన్యను సరన్తి గృహీతచాపా
స్తందేశ మాశ్రయతి డిమ్భవతీ కురఙ్గీ

అగ్రేవ్యాధః కరధృతశరః, పార్శ్వతో జాలమాలాః
పృష్ఠేవహ్నిర్జ్వలతిచ, పునస్సన్నిధౌ సారమేయాః
ఏణీగర్భా దలసగమనా శాబకైః పాదలగ్నై
శ్ఛిన్నాక్రాన్తా నిగదతిమృగీ కిఙ్కరోమి క్వయామి

ఆదాయ మాంస మఖిలం స్తనవర్జమఙ్గా
న్మాం ముంచ వాగురిక, యామి కురుప్రసాదమ్
అద్యాపిఘాసకబళ గ్రహణానభిజ్ఞా
మన్మార్గ వీక్షణపరా శ్శిశవో మదీయాః

మధ్యేజ్యాత్రుటితా ధనుశ్శరభసాత్ భగ్నం దవాగ్నేరయా
న్నిష్క్రాంతా భషకా స్స్వకైరను సృతా దగ్ధాశ్చ పాశాస్తతః
శాన్తోవహ్ని రకాలమేఘ సలిలై రేణీ కుటుమ్బావృతా
యాతా, తత్కరుణా కృపార్ద్రమనసో లక్ష్మీపతే రీదృశీ.

శ్రీ

---

శ్రీ యెదపైఁబ్రకాశిలఁగ శ్రీయెదఁ దానువసించి, కుక్షి లో
కాయతనంబుగాఁగ, జగ దంతర లీనత నొంది, మామ "మా
మా" యన జాయ కల్లుఁడయి మానిత చిత్ర చరిత్రుఁడౌ జగ
ద్గేయుఁడు భక్తసంచయ విధేయుఁడునాకుసహాయుఁడయ్యెడున్

అస్మదారబ్ధ సర్వకార్యానుకూల
పరిసమాప్తికిఁ బ్రార్థింతు భక్తిమీఱ
గజవదను, భక్తమానస కమల సదను,
నాంబికేయు, విధూత సర్వాంతరాయు.

సతతము నుతియింతు సర
స్వతి సకలకళానిధానఁ బ్రాణేశముఖ
స్థిత లోకత్రయనుత మ
త్కృతికిఁ జమత్కృతినిఁ గూర్చి క్షితి వెలయింపన్.

కవిత లోకమందుఁ గల్పించి, కల్మష
హారము రామకథ మహాద్భుతముగ
విబుధ వినుతముగ సవిస్తరముగ వ్రాసి
నట్టివామలూరు పట్టిఁ దలఁతు.

పరఁగు నచతుర్వదనవిధి, కరయుగాచ్యు
తుఁడు, నఫాలాక్షచంద్ర చూడుఁడు, ననంగ
నే మహామహుఁ డట్టి మౌనీంద్ర వినుతు
బాదరాయణు భగవంతుఁ బ్రస్తుతింతు.

ఆ నిశాకర తారార్కమై చెలంగ
సంస్కృతాంధ్రంబులను గ్రంథసమితి వ్రాసి
యఖిల జనకీర్తనీయులై నట్టికవుల
శేముషీ భాసురుల సమర్చింతుభక్తి.

ఏ విద్వత్కవిచంద్రు సాంద్ర కరుణా వృష్టిన్ గవిత్వప్రరో
హావిర్భావము గల్గి పెంపెసఁగె నాయుం డట్టి వేదాంత వి
ద్యావైదుష్యవిభూషణున్ రసరహస్యజ్ఞానపారీణు దు
ర్భావంశ్యున్ వినుతింతు మద్గురుని సుబ్రహ్మణ్య ధీమన్మణిన్.

సకలనిలింప సన్మకుట సంఘటితామల పారిజాతదా
మకమకరంద ధౌత రుచిమత్పద కంజునకున్, ఫణీంద్రశా
యికి, నిజభక్తలోక నిఖిలేప్సితదాయికి, శౌరికిన్, బలా
శి కుల విదారి కర్పణము చేసెద మామక కావ్యకన్యకన్.

---



# కురంగీ కిరాతము.



ఉపరి సంచరదళియూధ ధూమంబుతోఁ
బల్లవి తామ్రాగ్ను లుల్లసిల్ల
శ్రుతిహిత స్వనముల శుకముఖ్యనుత విప్ర
వరసముదాయంబు పరిఢవిల్ల
వనము త్రియపు సేస లునిచిన చివురు ప
ళ్ళెములూని తీవియ లేమ లమర
నయ్యుయిచోట్ల లాస్యవిలాసలాలస
బర్హి శైలూషాళి వఱలుచుండఁ

గదళికల నల్లుకొనియున్న మృదుల లతల
పందిరుల సొంపు పెంపార వనరమా వ
సంత పరిణయ సమయ సంస్మరణఁ గొలుపు
నగణిత మృగావనము వింధ్యనగ వనంబు.

నానావిధ ఖగమృగ సం
తానాకర మాటఁ దద్వనంబునకుఁ బుళిం
దానీకము వేఁటాడం
గా నరుగుచునుండుఁ గౌతుకము పెంపెసఁగన్

బిఱుసువాఱిన పల్లకుఱుచవెండ్రుకలు పోఁ
 గునఁ గుచ్చుగా నెత్తి కూర్చికట్టి
కారుమబ్బును గేరు కటిమేను, కరకవ
 న్నియ చల్లడంబును, నీలికాసె,
చూపఱ వెఱపించు చుఱచుఱచూడ్కి పు
 స్త్రీలు, బలోక్కర మీసాలు దనర;
గొరకత్తిమొల, నంపతరకసంబును వెన్క,
 డాచేత శల్యదండము ధరించి;

పులుఁగు చిక్కాలు కుందేటివలలు మేటి
సింగిణియుఁ దాల్చి, యొకనాఁడు శీఘ్రగతిని
నవ్విపినమధ్యపథమున నరుగుచుండె
భీకరాకారుఁడై యొక్క వేఁటకాఁడు.

చీమచిటుక్కన్నఁ జెవిదార్చివినుచు, మో
ములువాంచి పుడమిని మూరుకొనుచుఁ,
గలయంగ నఱ్ఱెత్తి గాలిరూ పరయుచు,
నొండొంటితనువుల నొరసికొనుచుఁ,
గదుపు వేర్పడ నేల నెదియో వెదకికొంచుఁ,
దెరువున కటునిటు బెరసి చనుచుఁ.
బేర్వట్టి యొడయండు పిలువఁ దోఁకలనార్చి
కొనుచు ఱివ్వున వానిఁగూర్చిచనుచు,

నిడుదమూతులుఁ, దోలుపట్టెడల మెడలు
బలుపుఁదొడలును గుండియబటువుగలుగు
వేఁటకుక్కలగమి వానివెన్నుఁదవిలి
యడవిమెకములు వెగడంద నడుచుచుండె.

అరుదగుశక్తి నాదికిరినైన, దిశాకరినైన, దుర్గకే
సరినయినన్ నిజేశుకరసంజ్ఞ దురంబునకున్ మరల్చి, యు
ద్ధురతఁ దెరల్పఁజాలునని తోఁపఁగఁజేయుచునుండె వానిభీ
కరమగుఃరూపు, గయ్యమనఁగాల్కడుఁద్రివ్వెడు నేపు చూచినన్.

కురంగీకిరాతము

నికటలతాకుడుంగపరి నిర్గత నిర్మల మారుతాంకుర
ప్రకటితమాట, శ్వాననికరంబు తదంతరవర్తియై శశం
బొకటియడంగి యుంటెఱింగి హుమ్మని యమ్ములఁ జిమ్మినట్లుగా
ప్రకట! తదీయజీవహరణార్థము గుప్పునఁ బాఱె, యప్పొదన్.

బిరబిర వలగొని లోఁజొరఁ
దెరువుగనక త్రొక్కులాడు తెఱఁగునెఱిఁగి, య
య్యెఱుకు పొదరు దండమునన్
జఱవఁ బెదరి వెలికి శశము జవమునఁ బఱవన్.

వెనుకొని కుక్కలు భౌభౌ
ధ్వను లాకసమున్ బగుల్పఁ దఱిమితఱిమి ఱి
వ్వునఁ దద్దేహంబునుదు
త్తునియలుగాఁ జీల్చివైచెఁ దుందుడు కెసఁగన్.

దిక్సమూహంబు మార్మ్రోయ దివి యదుర్వఁగ
నుఱుములఱిమినట్లు సారమేయోత్కరంబు
ఘనగళధ్వని యట్లుచేసిన, వనంబు
ప్రాణికోటులు కలగుండుపడియెఁ బెగడి.

తావువిడిచి చలముతగ్గి పోరుదొలంగి
నిదురయుడిగి మేఁత నీరు వదలి
జంటలెడసి యఖిల జంతువితానంబు
బెదరి చెదర భిల్లుఁ డదయుఁడగుచు.

వలలొడ్డియు, బలునారస
ములనేసియుఁ, బల్లెములను బొడిచియు, దండం
బులనడిచియుఁ, గుక్కలనుసి
కొలిపియుఁ, బెక్కింటి వానిఁ గూలార్చె వడిన్.

కాండముఖ్యాయుధప్రయోగప్రవీణ
తయును, దోర్బలమును, శౌర్యధైర్యములును,
మెఱయ వనసత్త్వతతి దయదొఱఁగి తెఱుఁగు
చెందుచుండఁగ నచటికిఁ జేరువునను

గవిచీఁకుఁజొప్పు కన్గవ మెఱుంగులు గ్రిక్క
తెప్పవాల్పనిచూడ్కి నొప్పుదాని
ముంగాళ్ళనేలపై మోపి వీనులు ఱిక్క
పెట్టి కూర్చుండి గుర్పెట్టుదాని

సెలవుల మూఁగు నీఁగలఁ దటుక్కునఁ నప్ప
ళించి మాటికిఁ జప్పరించుదానిఁ
బహువుగా నెదుటఁ గన్పడు వేఁపులకు నల్గి
మించి యార్పులు సందడించుదాని

మేనిచాఱలు మిలమిల మెఱయుదానిఁ
గ్రోలుపులి నొండు గన్గొని కుక్కలెల్ల
దిట్టతనమూని మిక్కిలి తెంపుసేసి
పోరనుంకించి జంకించి పొదివెదాని.

డీకొని కుక్కతండము కడిందిమగంటిమి ధైర్యమూఁతగాఁ
జేకొని కేక లాకసము చిల్లులువెట్టఁ దటాలునన్ దనున్
దాఁకిన నుల్కిపాటడరఁ దద్దయుఁ బాదతలాహతోగ్రద
ర్వీకరమట్టులౌచు నతిభీషణ రోషవిజృంభణంబునన్

నీలిగి యావులించి కనునిప్పులురాలఁగ వాలమార్చి యా
భీలరదాళి వెల్వఱచి పెల్లుగ గర్జిలి రోషపావక
జ్వాలలుగ్రక్కుచున్ నిశిత భల్లనఖాన్వితపూర్వపాదముల్
చాలఁగవిప్పి జాగిలపుఁజాలు నెదుర్కొనె వ్యాఘ్రిమత్తఱిన్.

దుముకుచు, మొగ్గుచుఁ, జవముతోడగిఱుక్కున వామదక్షిణ
భ్రమణ మొనర్చుచుఁ, దొలఁగఁ బాఱుచు శాతనఖోగ్రదంష్ట్రికా
గ్రములను వ్రచ్చుచుఁ విజయ కాంక్ష లెసంగఁగ శ్వానపుండరీ
కములు మహోగ్రభంగిఁ బెనఁగఁ దొడఁగెఁ గడుసాహసం
బునఁ.

క్షమఁ, దనకెంతమేలిజన సత్త్వములుండిన నెట్లు కాద్రివే
యము చలిచీమపిండునకు నాఁగఁగఁ జాలక చిక్కునొందుఁ,ద
త్క్రమమునఁ జిక్కె నుక్కఱి దురంబునఁ బెబ్బులి బెట్టిదంపుశ్వా
నములకు; దంతిచిక్కదె తృణవ్రజనిర్మితరజ్జుబద్ధమై?

సంచలనంబునొంద కోకజాగిల మాపులిపైకి బిట్టు లం
ఘించి నిశాతదంష్ట్రికల గ్రీవము గాయమొనర్పగా విజృం
భించి మృగారి పై కెగసి వేఁపులగుంపునదూఁకి వే విదా
రించె క్షణంబులోఁ ధరణిఁ ద్రెళ్ళఁగఁ గొండొక విశ్వకద్రువుఁ.

అత్తఱిఁ గుక్కలించుక భయంపడి వెన్కకుఁదగ్గి వెంటనే
మొత్తములై మనోదృఢిమముంగొని యుత్తఱి దీని మిత్తికిఁ
బుత్తము లేక చత్తమని పూనినవోయనఁ బ్రాణభీతిఁ బో
మొత్తి వియత్తలం బగల భూరిగళధ్వని పెల్లెసంగఁగఁ.

పిడుగులు వడ్డయట్లు శరవేగముతో నమితోగ్రభంగి న
య్యడవిమెకంబునుంబొదివె, నత్తఱి నెత్తగుచెట్టునెక్కి య
య్యొడయఁడుసారమేయసమరోద్ధతిమెచ్చుచునోంచుచుండెఁదా
నెడనెడఁ జాపముక్తనిశితేషుల నబ్బెడిదంపు బెబ్బులిన్.

క్రూరతఁజెంగలించుచును గోఱలఁజూపుచు హుంకరించుచున్
గోరులవిచ్చుచుం బులి యకుంఠితరీతి ధురంబునన్ మహా
దారుణభంగిఁ గుర్కురవితానముతో వెసఁబోరెఁ దత్తనూ
భూరితరాస్రధారలకు భూతలమయ్యెడ నెఱ్ఱవాఱఁగన్.

నొచ్చియు నీడఁబోక యదనుంగని శ్వానము లొక్కపెట్టునన్
వచ్చి గళంబు పాదములు వాలము గర్భము వెన్నుపార్శ్వముల్
వ్రచ్చిన,గైరికాద్రినెఱవాఱిన నేఱులనొప్పుశైలము
ట్లచ్చుగనిల్చెవ్యాఘ్రమొడలంతయునెత్తురులొల్కుచుండఁగన్

అక్కట, యెట్టిఘోరమృగమయ్యును గ్రొవ్వులియెంతసేపుతా
నొక్కటి పెక్కుకుక్కల మహోద్ధతికిన్ మఱిభిల్లుఁ డేయుపే
రుక్కుటలుంగు తాఁకులకునోర్చుఁ? గ్రొఁతులగుంపెదిర్చినన్
రక్కసుఁడైన స్రుక్కఁగద! ఆలుఁగున్గద చీమప్రాఁకులన్

పోఁడిమిదక్కి సొక్కి విరఁబూచిన మోదుగుపోల్కి నొప్పి, పో
రాడియొకింతసే పవలనాఁగఁగఁజాలక సొమ్మసిల్లి జీ
రాడెడునంత్రిజాలముల నప్పులి యప్పుడు నేలఁగూలఁ, గొం
డాడుచు వేఁటకుక్కల, రయంబున భిల్లుఁడు డిగ్గివృక్షమున్.

చేరరావించి, కడుసంతసించి, నిమిరి
కాయములన్, గాయముల నీటఁగడిగి యద్ది,
తగుచికిత్సలొనర్చి వే త్రావఁ గుడువఁ
బెట్టి శ్రమవాపెఁ గౌలేయవితతికంత.

నాలుకవ్రేల, నాల్గుచరణంబులు చాఁచి, శిరంబువ్రాల్చి, దం
తాళిబయల్పడంగ, రుధిరాప్లుతదేహముమీఁద మక్షికా
జాలముమూఁగఁ జూపఱకు జాలిజనింపఁగఁజేష్టదక్కి, పె
క్కాలములన్ జయించినమృగాధిపమట్లసువుల్ దొలంగఁగన్.

అత్తఱిఁ గత్తిగొంచుఁజని, యప్పులికోఱలు గోళ్ళుపుచ్చి, మై
కత్తిని నొల్చి ముందరవధించిన జంతుల చర్మమాంసముల్
పొత్తరలొప్పఁగట్టి తనమూఁపునఁ గావడిగా ఘటించి, యు
ద్వృత్తిని గుర్కురాళియు దేర నతండు గృహాభిగామియై.

జ్వలదుత్తుంగ శిఖాభిభూతసుమనశ్శైలంబు, గుప్తార్క దో
హాలఘూమోగ్రితమోంతరోచ్చలదసంఖ్యాకస్ఫులింగంబు, ది
గ్దళనధ్వానవిదీర్ణవేణు, వతిభీ ధావద్వనీజంతుసం
కులకోలాహలమున్ దవానలము నొక్కొండారసెన్ దవ్వులన్

ఎఱక లల్లార్చుచును బూనిక్కనెగురఁ గడఁగు
కనకగిరినా భయాశ్చర్యజనకమయ్యె
సతత పతదున్నమ న్మరుద్ధత బృహచ్ఛి
ఖానికాయంబుచే నరణ్యానలంబు.

పొదరిల్లు లంఘింపఁబోయి లతాబద్ధ
చరణమై బెగడొందు హరిణవితతి
నిమురమత్తున దవాగ్నినిజూచి బెదరి చే
ష్టలుదక్కి నిలుచు బెబ్బులులపిండు
గాఢధూమము కప్పి కనులుగానక చిక్కి
యేదారి నెఱుఁగని యెలుఁగుబంట్లు
చిప్పచిప్పనఁ జిట్లు చివరకొమ్మల కెక్కి
వేఁడిసోకఁగఁ బట్టువీడు కపులు

తనకు నాహుతిగా మారుతంబు ప్రోపు
నొసఁగ నాసర్వ భక్షకుం డుగ్రభంగి
నెదురులేకేచి వనిదహించు గరిమ
నబ్రపడి కాంచుచుండె నయ్యాటవికుఁడు.

శ్రమమునకోర్చి కొన్ని దివసంబులు మృద్ఘటముఁ ఘటించి, దం
డముగొని దానినాశన మొనర్చుకులాలునిభంగిఁ బెక్కు వ
ర్షము లభివృద్ధిచేసిన యరణ్యము వమ్మొనరింప నేమిలా
భమొ తన, కెవ్వఁడోపు భగవంతుని లీలల గుట్టెఱుంగఁగన్!

ఆమెఱు కిట్టి భీకర దవాగ్నుల నెన్నియొ మున్ను గన్నవాఁ
డైయునికిన్ వెఱంబొరయ కాగత తజ్జనితోష్ణవాయువుల్
పాయఁదొలంగి జాగిలములన్ గుమిగా నొకచోటఁ జేర్చి తా
నామెడనున్న యున్నతమహావనిజాగ్రముఁ జేరి, చెంగటన్.

సన్నని పునమట్లు స్వచ్ఛమై విలసిల్లు
వారి నొప్పారు కాసార తీర
ధరణిని విరివిగాఁ బెరిగిన కురవక
తరులతావులు మింట నెఱయు చోట

నురుతమాల ద్రుమోత్కరమిరుల్ గురియుచుఁ
బెట్టని గోడయై చుట్టుఁదనరఁ
బలువన్నియల క్రొన్ననలఁ జెన్నుమీఱు శా
ద్వలమను రత్నకంబళము మీఁద

నుస్సురుస్సురటంచు నిట్టూర్పులడరఁ
దఱచు మూల్గుచు, వదనంబుఁ దెఱచు చవని
పొరుగుచును, లేచుచును, దిక్కులరయు చిల్లు
ప్రసవవేదనఁ జెందు సారంగిఁ గాంచె.

అరసి, విపన్నమగ్నమృగియం దిసుమంతయు జాలిలేని యా
మొఱకెలు "కిట్టివేళ మృగముల్ దెగఁజూచువినోద మెప్డు ము
న్నెఱుఁగను, నేఁడు దీనివధియించి ముదంబువహించి యింటికే
నరిగెదఁ బావకాగమము కన్నను ము"న్నని యెన్నుచుండఁగన్.

పారములేని జళుక్కన విప త్తెటువచ్చునో యన్నశంక నా
హార విహార సుప్తి సమయంబులనేఁ బొరలేనిజాతికిన్
జేరినదాట యా మెకపుఁ జేడియ కాంచె ద్రుమాగ్రజాగ్రదు
గ్రారి, నిరంతరాటవి విహారి, శరాసనధారి, నక్తకిన్.

నీతియొకింతలేని రజనీచరతుల్యుఁ గిరాతుఁ జూచి ని
ర్ఘాతనిపాతరీతిని గురంగలతాంగి మునింగి మూర్ఛలోఁ,
వాతవిధూత వల్లివలె వ్రాలెనిలాస్థలిఁ గొంతసేపు త
ర్వాత మనంబెఱింగి దురవస్థఁ గడుంగడు నూర్పుపుచ్చుచున్.

హా కుటిలాత్మ! నేఁడుదయ మాదిగఁ దీఱని బాధఁ బ్రాణముల్
పోకకు సిద్ధమై వనటఁ బొక్కుచునుండఁగ గోరుచుట్టుపై
రోఁకటిపోటు చందమున రూఢిగఁ గాలునిఁబోలు నీదునా
లోకము సంభవించెఁ బరలోకమె నాకు శరణ్యమింకిటన్.

నెఱిగల కజ్జలంబుఁ బురుణించు తనుద్యుతి, నుజ్జ్వలాంబక
స్ఫురణఁ, బరిభాకర పరిభవముఁ గని యేచి సమస్తజీవులన్
ధర మనసీక దక్షిణ పథస్థితి నున్కని, దండపాశభీ
కరతఁ, గిరాత, పేరితవతిగా మతిఁ దోఁచెద వీవు నాకిటన్.

ఎన్నఁడయి మాదు తీయఁదని నీవు మొగంబులఁ దన్నికవచ్చి వ
న్నదునఁ గల్పఁ బూనితివి; మాయక ధావన లాఘవైకసం
పన్నత నిన్నుఁ గన్గొనఁగ పాటఁ గల్గితిఁ గాని నేఁటికా
పన్నత నొంది చిక్కితిఁ గృపారహితా! మృతి తప్పనే యిఁకన్.

చూలు నిల్చిన దాదిగా "లోకసామాన్య
భంగి నేను నిసుంగు పడయఁగలను,
బడసి, ప్రేముడిఁ బాలుగుడిపి కడ్పారఁగాఁ
దృణము మేయు తెఱంగుఁ దెలుపఁగలను,
దెలిపి, చెర్లాటగంతులు వేయఁ గనులార
నరసి తచ్చేష్టలకలరఁ గలను
అలరి, మూర్కొని ముద్దులాడి ముచ్చటదీఱఁ
గాలంబు హాయిగాఁ గడుపఁ గలను"

అనుచు గొంతెమ్మకోర్కెలఁ బెనుచుచుంటి
మరు మరీచుల జలమని మదిఁ దలఁచితి
మొదటికే దైవమా, యిట్లు మోసమౌటఁ
బోలఁ గనలేక నేనెంత బేలనైతి.

కుదిరిక గల్గి నెమ్మదిని గోరిక లీరికలెత్త, గర్భమ
భ్యుదయముగాఁగ సేమమునఁ బుట్టిన పట్టిని ముచ్చటారఁ బెం
పొదవఁగఁ జేయునట్టి సతి కుద్భవమొందక, మందభాగ్యకి
ట్లుదయమునొందియేమిసుఖమొందఁగఁ జూచితివయ్యొ శాబమా

పట్టీ, పుణ్యాత్ములకుం
బుట్టినవారెన్ని వర్షములో మనుచుండన్
గట్టిఁడినగు నాకడుపునఁ
బుట్టకమునె నీకు వర్షములు నూఱయ్యెన్

నినుఁబ్రతిమాలుకొందుఁ గరుణించి నిషాద, వధింపకిప్పు న
న్ననుపుము, బిడ్డ నాకడుపునన్ దగ నిన్నిదినాలుగా వహిం
చిన ఫలమించుకంతయినఁ జేకుఱఁగాఁ బ్రసవించి తద్విలో
కన మొనరింపని, మ్మవలఁ గాయము వాపు, మదిష్ట మింతయే.

అని తనకాంచనున్న శిశు వందలిప్రేమభరంబుచేఁ నా
జనని మహార్తి నశ్రువులు జాల్కొన నూర్పులెసంగ గోలుఁగో
లునఁ గడు వెక్కివెక్కి తనలోననదా వనరోదనం బొన
ర్చెనకట, బెట్టుగన్ దరళదృగ్ద్వయ మెంతయు నెఱ్ఱవాఱఁగన్

దుర్భరవ్యథాగ్ని గర్భంబు దరికొల్పఁ
బనవి పనవి యేణవనిత తనువు
మఱచి మఱలఁ దెలిసి పరిపరివిధములఁ
దలఁపు గదుర నూరుపులు నిగిడ్చి.

పోరనుమాట లేక తృణమున్ గలచో నిసుమంత మేసి, కా
సారజలంబుఁ ద్రావి నలుచాయల దాయలభీతి నిద్ర క
న్నారనెఱుంగ కియ్యడవియం దోడ లోమెడు లేటి బోటికిన్
గూరిచెఁ జాలుపేరనిటు క్రూరపు మృత్యువు, దైవ మక్కటా.

ఓ మూర్ఖా, యరుణోదయ ప్రభృతి నీ వుగ్రింబుగాఁ గానఁ "గు
య్యామొజ్జో" యనఁ గుత్తుకల్ దఱిగి యెన్నో ప్రాణులన్
నిర్దయన్
భూమిన్ గూల్చెయుందు, దానఁదనియంబో కిట్లు చూలాలి న
య్యో మేలే వధియింప, నాపదలు రావో నీకు నెప్పట్టునన్

తుంటరి వేఁటకాఁడ! యసితో వెస నీయుసురుల్ గ్రసింప నీ
కంటె బలాఢ్యుఁడొక్కరుఁడు గన్పడెనేనిఁ ద్వదగ్రసీమ నీ
వొంటరి వైనయప్పు డెటు లుందువొ నీమది నెంచవేల, నీ
వంటి శరీరమున్ మనసు బాధయు భీతియు మాకు లేవొకో.

ఏలొకొయిన్ని, యొదువచియించెద, బిడ్డలఁగాంచలేదె? గో
డ్రాలె త్వదీయదార, ప్రసవార్తి నెఱుంగదె, యెప్పుడైన ని
ల్లాలుతగన్ సుఖప్రసవ మాటకు వేల్పుల కీవు మ్రొక్కవే
మేలె మమున్ వధించు టెటు? మీవలె జీవుల మేము,గామొకో

ప్రాణిసమూహమందు, నుచితానుచితజ్ఞత, పుణ్యపాప వి
జ్ఞానము, మున్నుగాఁ గల ప్రశస్తగుణంబుల కల్మి నన్నిటన్
మానవుఁ డెక్కుడంచు నిగమంబులు చెప్పను నేతిబీఱనాఁ
గానదియెల్లఁ బొల్లగుచుఁ గన్పడు నీదగు వర్తనంబునన్.

వ్యసనములందు వేఁట యొకటౌట సుబుద్ధికి వర్జ్యమంచు ని
వ్వసుధ వివేకులెల్లరును పల్కుదు, రయ్యది లెక్కసేయ,కీ
వుసురుమనంగఁ జంపితి వహో, బహుజీవుల, దానఁదృప్తిలే
కసుర విధాన నిట్టిసమయంబున నన్మడియింపఁ జూచెదే?

పలలాపేక్షన్ మము గొం
తులు గోయుదువేని యోరి దుర్మతి, క్రవ్యా
దులకును నీకును భేదము
గలదే, మనుజాఖ్యఁ గాల్పఁగడఁగితివె ఖలా!

పొలదిండ్లకుఁ దద్భిన్నుల
కిల భేదము నలువ దెలుపఁడే దంత నఖా
దుల? దానఁ దాను మర్త్యుఁడు
పలలము వర్జించి హింసవదలఁగ వలదే.

ఇల హత్య వినోదార్థము
సలుపఁదగునె, యింత తెలియఁజాలరె నరజ
న్ములు, పిల్లికిఁ జెరలాటం
బెలుకకుఁ బ్రాణాంతమాటయేల యెఱుఁగరో.

తులువతనాన నాయుధముతోఁ బడనేసిన నోరులేని జీ
వుల నుసురంచు నవ్వి యసువుల్ వెసఁబాసెడివేళ బాధలన్
విలవిలఁ దన్నుకొంట కనువిందె? వినోదమె నీకు మూర్ఖ? వ్రి
య్యాలగుట లేదె నీయెడఁద హా, యదిగండమొ, వజ్రఖండమో!

అతిశయ బాహువీర్య జనితాహవఖర్జుఁడవేని నీసము
ద్ధతి హరిపుండరీకముఖ తావక వైరుల మీఁదఁజూపు మా
యతగతి; మూలనున్న ముసలమ్మపయింబడునట్లు మమ్ముఁగ్రూ
రత మడియింతువే నిరపరాధలమాటిసుమంత యెంచవే.

కుంభిని నేరికిన్ భరముగూర్చెదు నార్తి మునింగియున్ వచో
గుంభన శంబరాంగన యకుంఠితరీతి నరాతి నిట్లుపా
లంభము సేయుచుండు నెడలన్ శిరమున్ మునిగాళ్ళ దోఁపఁగా
డింభము సాము గానఁగఁ బడెన్ బెడఁగై, తదనంతరం బటన్

అభ్రిపథంబంటు నత్యున్నతార్చులు
రంగదుత్తుంగ తరంగములుగఁ
గాలాంజనచ్ఛాయఁ గార్కొనుధూమముల్
తమహరి చలదంబుదములు గాఁగ
అవిరళ విస్ఫులింగాళి మహాబలో
ద్ధూత కీలాల బిందువులు గాఁగ
నానావిధోద్భటధ్వాన వితానముల్
తత్కాల ఘుమఘుమ ధ్వనులుగాఁగ

నఖిల వనజంతు సంతాన మడలునొంద
నగతతులనెల్ల గడియలో నాక్రమించి
మేరమీఱి మహార్ణవాకారమగుచుఁ
గారుచి చ్చురుదేరఁగఁ గాంచె హరిణి.

తుంగమహీధ్రపాతగతి తోఁపఁగ, క్షుత్కుపితాంతరంగ సా
రంగవిరోధి దంత నికరగ్రసితాంగి తెఱంగునన్, కురం
గాంగన వాగతీతమగు ప్రాణభయంబునఁ దల్లడిల్లె న
య్యంగళమంతకంతకుఁబయింబయిఁబ్రాఁకు తెఱఁగుఁజూచుచున్

నికటవ్యాపి దవాగ్నిఁ గాంచి, నిజతూణీర స్ఫురద్భీకరాం
బకముందూసి, పుళిందుఁడప్పుడనుకంపాశూన్యుఁడై, యాలసిం
పక దీనిన్ వధియింపఁ బోలునని చాపంబందు సంధింప నెం
చి కడంగం గని యేణి కన్నుఁగవ మోడ్చెం జావసంసిద్ధయై.

పిటికిజాతి మొదలె, పెంటి దానికిఁదోడు,
కాన్పువేళ, త్రుంపఁ గడఁగె వైరి,
అగ్ని గ్రమ్మఁబాఱె, నట్టిదుర్దశఁ జెప్ప
నలవియగునె? యూహ్యమగునుగాక.

మృగి నిశ్చలమతి నత్తఱి
పగలెల్లను మాని తనకు బాంధవుఁడపుడా
భగవంతుఁడెయని కన్నులు
మొగిచియ యొనరించె స్తవమున్ దృఢభక్తిన్.

ఓవైకుంఠ, దయామయా, చతుర మాయోపాయకృత్తారివా
రా, వారాశిశయాన, చక్రధర, గర్భక్షిప్త వేధోండ భాం
డా, విశ్వంభర, సర్గ పోష లయ కర్తా, దీనసంరక్షణా
రావేదేవ, ముకుంద, మాధవ, హరీ, రక్షింపు సర్వేశ్వరా.

దివి, భువిఁ, గిరి, గాలి, నుదధిన్, దిశలన్, నిశలం, బవళ్ళ, దా
నవ సుర మర్త్య పక్షి మృగ నాగవితానముచేత మిత్తిలే
ని వరము గొన్న దైత్యవరునిన్ దెగటారిచి ప్రోవవే తదు
ద్భవు, మఱియట్టినీకు ననుఁబాలన సేఁత భరంబె మాధవా.

పవిఁదృణమట్లుగాఁ, దృణము వజ్రముగా, స్థల మబ్ధిగా, మహా
ర్ణవము స్థలంబుగా, నణువు గ్రావముగా, గిరి మృత్కణంబుగా
సవరణ సేయశక్తుఁడవు సర్వనియంతవు నైన నీకుఁ గా
కెవరికి సాధ్యమయ్య పరమేశ, మదార్తి హరింప నియ్యెడన్

తామసింపఁగాదు తరుణమ్ము, దావాగ్ని
దగ్గఱించె, నెఱుకు దయఁదొలంగి
చాపమందు శరము సంధించుచున్నాఁడు
రమ్ము రమ్ము వేగిరమ్ము తండ్రి.

సంగరభీమ, మున్ను వన చారికి నవ్వనమందుఁ జిక్క, సా
రంగము దిక్కుమాలి నినుఁబ్రార్థనసేయఁగఁ బ్రోచితన్న యా
సంగొని వేఁడికొందు వనచారికి నివ్వనమందుఁ జిక్కసా
రంగకులోద్భవన్ నను గరంబనురక్తితలిర్పఁ బ్రోవఁగన్.

మది దృఢభక్తి నిట్టు లసమాన సమాధి నెసంగు నమ్మృగీ
మదమున నక్కిరాతుఁ డొకమార్గణముం దొడియేయఁబోవఁ ద
త్ప్రదరముచేయి జాఱి యిలపైఁబడుటొప్పెఁ గురంగకాంత దీ
న దశఁ దొలంగఁ జేయఁగరుణారతుఁడీశుఁడు పూనెనో యనన్.

అమ్మేటుక్రిందజాఱిపడు టారసి యాశబరుండు మున్నిమి
త్తమ్మని సంశయించి యెడఁదన్ దలఁచెన్ మును వేఁటనేఁ బ్రవే
శమ్మొనరించుటాదియిటు సంభవమాట యెఱుంగ, నంతరా
యమ్మగునేమొ నాకడఁక కైన నిదింతకె మానువాఁడనే?

కడఁగిత్యజింపరుత్తములు కార్యముఁ, బూనిత్యజింతురు మధ్యముల్
పుడమిఁబ్రయత్నమెప్పుడధముల్ సలుపం దలపెట్టరందురు నేఁ
గడపెద దీని, విఘ్నమెటుగల్గెడినో కనుఁగొందు ధైర్యముం
సడలక, వేఁడినీరములు చల్లినయంతనె యిండ్లుకాలునే?

అమితదాక్షిణ్య యుక్తులైనట్టివారి
మాటిమాటికి శంకించు మానవులఁ బ
రాపవాదమునకు భయమందు నరుల
విడిచి సంపద దవ్వుగా వెడలు నందురు.

ఇంతటికెంతకార్యమిది, యిప్పనికింత వితర్కమేల గో
రంతలు కొండ సేయుచు, మహాద్భుత మత్కరచాపముక్తదు
ర్దాంత శిలీముఖోద్ధతికిఁ దప్పిచనన్ హరికైనఁగాదునా
నెంతటిదీకురంగి, హరియింతునిమేషములో నటంచొగిన్.

అతిశయదుర్మదంబు దురహంకృతియున్ సదసద్వివేకశూ
న్యతనెలకొల్ప, నల్పమతి నాతఁడెఱుంగక భావికాలదు
ర్గతి, నవిచారధైర్యమమరన్ హరిణిన్, బ్రసవార్తఁ, బావకా
వృత, భగవత్సమర్పితశరీర, హరింపఁగఁబూనెఁ గ్రూరతన్.

మును వినోదార్థమై పూనె, వెనుకదుర్ని
మిత్తశక్తినిగనఁ బూనె మృగివధింపఁ,
బ్రథమ కారణమున కంటెఁ బ్రబలమయ్యె
రెండవది, యింకఁ జంపకెట్లుండు నతఁడు?

ఆవని వాఁడు నాఁడు భషకావళిఁ గూడి యనేకజీవులన్
దా వధియించి నిర్దయతఁ దత్పలలాదుల నంది యంతటన్
బోవక మూర్ఖుఁడై కలుషపుంబనినాక యటన్ "వినాశకా
లే విపరీతబుద్ధి" యను లీల దొరంకొనె ఘోరకర్మకున్.

తన తనువు సోఁక నొకకొన్ని చినుకులపుడు
కాంచెఁదలయెత్తి మృగయుండు కారుమొగులు
ఘనతమాలావృతాంజన క్ష్మాధరంబు
కాంతిఁదెగడి నభఃస్థలిఁ గప్పియుంట.

అరసి యఖండవృష్టికురియంగలదంచును నూహసేసి, స
త్వరముగఁ బూన్కిఁదీర్చికొని తాఁజననెంచి, మదాంధచిత్తుఁడ
య్యెయుకు శరాసనంబుగొని, యేచి, గుణధ్వనిచేసి, తూణవి
స్ఫుర దిషు వొండుదూసి కడుఁబూనిక మీఁజశరవ్య మేర్పడన్.

తగ నాలీఢపదంబున న్నిలిచి సంధానంబుగావించి యా
శుగ మాకర్ణముగాఁగ బల్మికొలఁదిన్ శుంభన్మదస్ఫూర్తి లా
గఁగ, దైవోపహతుండతండగుటచేఁ గాఁబోలు పెళ్ళంచు రెం
డుగఁ జాపంబు ధ్వనించుచున్ విఱిగెఁ,గష్టుండాతఁడప్పట్టునన్

విఱిగిన వింటికొ పపుడు బెట్టుగఁ గంటను గ్రుచ్చికోఁగ, దు
ర్భరమగు వేదనన్ స్మృతి దొఱంగి, పదంబులపట్టుతప్పి భీ
కరముగ లక్ష్మణాశుగ నికాయహతిం బడు మేఘనాదు న
ట్లురవడి నేటవాలుగను నుర్వరపైఁదలక్రిందు గాఁబడెన్.

పడునప్పు డల్ల శుష్కవిటపంబాక కొంతయుఁ గొడ్డురీతి నే ర్పడియునికిఁ దదగ్రవిని పాతమునొందుటఁ దత్కిరాతుక్రీఁ గడుపునఁ జొచ్చి యద్ది వెనుకఁ గనుపట్టె వికారభంగి, నెం తిడుమ ఘటిల్లె, నింకఁద్రుటి కేమగునో యెఱుగంగ నేర్తుమే.

అచటి పొదనున్న శశమొక్కఁడక్కిరాత
పాత నినదాతిభీతమై పఱచుచుండ
వానిజాగిలములు సూచిదానిఁబట్టఁ
దఱిమికొను చేగెనెంతయు దవ్వుగాఁగ.

అయ్యెడ మేఘంబు లంతకంతకు నెక్కు
డై దిగంతంబుల నాక్రమింపఁ
గారొక్కన్న నిబిడాంధకారంబునందను
క్షణ తటిత్కాంతులు గడలుకొనఁగఁ
గకుబంతవిచ్ఛేద కరములై లోకాతి
తర్జనల్ నీరద గర్జలడర
మునుపటి చిటిపొటి చినుకులు భూ వ్యోమ
ములకేకధారలై పొదలుచుండఁ

గుండతో నంబరమునుండి కుమ్మరించి
నట్లు దవవహ్నిచల్లాఱె నయ్యరణ్య
జీవకోటులమనము రంజిల్ల వృష్టి
యరముహూర్తంబు లోనన కురిసివెలిసె,

ధరణిని శీఘ్రవృద్ధిదురితంబున కుఱవలె నింక దేనికిం
బోరయదు మేలుగూర్చునటుముఱ గనుపట్టును వెనుకఁ గూర్చుదు
ర్భరదురవస్థ యట్లగుటఁ బాపముమాని చరింపకున్నన
య్యోఱుకును బోలెదుర్గతులకిమ్మగు మర్త్యుఁడునిక్కువమ్ముగన్

విడిన జుంజుఱు వెండ్రుకల్ వ్రేలాడఁ
గన్నుల నీరు రక్తంబుఁగాఱఁ
జెదరిన మీసా లసృక్సిక్తములుగాఁగ
సెలవుల వెడలిన జిహ్వదోఁప
నెడలేని నిట్టూర్పు లడర దీర్ఘంబుగా
సొంపఱె నోటను జొంగగాఱ
విఱిగి వ్రేలాడెడు తరుశాఖల విధాన
వంగిజానులు కాళ్ళు పాయవడఁగ

రక్త సంప్లుత దేహ మరణ్యమున్
కా నికాయము గ్రిమ్మంగఁ గడుపుఁ జొచ్చి
వెలికిఁ ద్రోఁచెడు కొఱ్ఱుతో వికృతమయ్యె
నపుడు తలక్రిందుగా వ్రేలు నతనిరూపు.

జుమ్మని నోటిలోపలికిఁ జొచ్చెడు నీఁగల, రక్తసిక్త దే
హమ్మును ద్రొల్చుచీమల, భయంకర భల్లూక పుండరీక శ
బ్దమ్ములఁ, బ్రాణమున్నదను భావనఁ జేరక వేచియున్న గృ
ధ్రమ్ముల, నేర్పరించెడు తెలిం గిసుమంతయు లేనివిస్మృతిన్.

ఉండి యొకకొంతసే పాతఁ డొడలెఱింగి
తనువుమండఁగ నోరెండ మనము తల్ల
డిల్ల నత్యంతవేదన డిల్లపోయి
యేడ్చుటకునైన శక్తిలే కిట్లు తలఁచె.

బాబో! యియ్యది యేమిదుర్గతి, వడిన్ బ్రాణాలుపోవవ్యె, నే
నీబాధల్ పడజాల, నన్ననుపువా రెవ్వార లిక్కాన, న
య్యో బల్మ్యాన్మర్ష్య జనించె, మృత్యు విటు లత్యుగ్రంబుగాఁ
గొఱ్ఱు రూ
పై బిట్టుఁ జెడు, దప్పిపుట్టుఁ, దను వాద్యంతంబునున్ మండెడున్

నేరమిఁజేసి నే మిగుల నేరమొనర్చితిమొ యుండకున్న నా
వారికి దూర మీష్చి భగవంతుఁడు నిర్జన దుర్గమాటవిన్
జేరిచి, మున్నొకానొక ఋషింబలె ఘాతుక సత్వమధ్యమం
దూరక దారు శూలమున నుగ్రముగా నిటు త్రోసిచంపునే.

దట్టముగాఁగ గుడ్ల కెగదట్టిన క్రొవ్వునఁ జేత శస్త్రముల్
వట్టి నిరంతరంబు నిరపాయ మృగంబుల గోలుగోలనం
గొట్టితి నిర్దయత్వమునఁ గోట్లకొలందిగ, దోసమాట యు
ప్పట్టునఁ దోఁప కిప్డనుభవంబగుటన్ దెలియంగ నయ్యెడున్.

అదియటులుండ, నీయుదయమాదిగ నాడినవేఁటగాక దు
ర్మదమునఁ ద్రుంపఁ బూనితిఁ గురంగినిఁ గానుపువేళ నప్పుడ
య్యదిననుఁ గాంచి పడ్డవగ పంతయుఁజూచియు ద్రోహబుద్ధితోఁ,
దుదకది యింతచేసె, నెటుఁదోఁప దుపాయ మిఁకేమిసేయుదున్

ఎన్నఁడు కేలుజాఱి శర మీక్రియ భూతలపాతమౌట నేఁ
గన్నదికాని దయ్యు నది గట్టిగ దుశ్శకునంబుగాఁగ నే
మున్న యెఱింగియుం, బొగరుఁబోతు తనంబున లెక్కసేయ, నే
మన్న నిఁకేమి, చేసినది యంతయుఁ జెందక పోవవచ్చునే.

ఇవ్విధిఁ జెట్టు జాటిపడి, యెండలలో కోల్పడి కన్నకాలలో, కా
లమ్మొకరీతిఁ బుచ్చుఁ గనులన్ గనవే, యటులైనఁ గాక శూ
లమ్మటు ప్రాప్తమై యసువులన్ వెసఁబుచ్చెదు, నూపిరున్నను
ప్పుమ్మి మనంగ వచ్చు నకటా! స్మృతి తప్పుచు నున్న దెట్లొకో.

దిక్కెది ప్రాణభీతిని నలువంకల
　　ననుగాంచి పఱచెడు వనమృగములఁ
గరుణదొఱంగి ఆఁకటికి డెందముఁ బూని
　　కఱకుటలుంగులఁ గాయములను
గాడనేసితి, నవి క్షామతలిఁ బడి విల
　　విలఁ దన్నుకొను వేళ బిట్టు దండ
ముల దలల్వగులంగ మోఁదితిఁ బొడిచితిఁ
　　బాప మయ్యవి తమవారిఁ దలఁచి

యెంత పరితాప మొందెనో, యెంత దేహ
బాధనొందెనో, నన్నెంత స్వాంతముల శ
పించెనో, దైవమా, యింత వెతజనించె;
ధరణి హింసకు మించిన దురితమున్నె!

అనుదినమిల్లు నే వెడలునప్పుడు "నాయన నాయ"నంచు, నే మునుజను వెంతుమంచుఁ గడుమోడిగఁ గాళ్ళఁబెనంగ, "జింకపి ల్లను, బులిగోళ్ళఁ, బిలిగఱులంగొని తెత్తు" నటంచు నిల్చునా దనయులఁ జిన్నికుఱ్ఱలను; దత్సుఖమారయువా రికెవ్వరో.

చనవున నను డాసిన యను
వున జననిని నైన డాయఁ బో, రాటపరా
కున నున్నఁదక్క ననుఁబా
సిన త్రుటి యుగ, మెట్లులింక జీవించెదరో.

కడుఁ బసిబిడ్డ లంద ఱవ్వఁగాను తెఱుంగరు, చేతి కెవ్వరేఁ గుడు మొకటీయఁ బాడుగనుకొందురు, తల్లి మ్రొనే తొ యెప్పుడేఁ గుదువఁగఁ బిల్చువారికిఁ దమకున్నగలయాఁకటిపాఱ్ద్రెఱుఁగ; రె వ్వడువున నింక! పీరు మను వారలు నే ననుపుల్ దొఱంగినన్.

సంజకిల్లు సేరఁజనువెంతు నను నాస
నెదురు చూచుచుందు రేము, నాకు
మీకు ఋణము దీతె మీతండ్రి లేఁడింక
నన్నలార! యాతఁ డడఁగి పోయె;

అన్నపానాదులందు మీయమ్మమనసు
నొవ్వ, లేనివి దెమ్మను ఱవ్వలేక,
మెలఁగుఁ డున్నంతలోఁ బెట్టు మీకు నాపె
మిమ్ముఁ గాదని తినఁ బోదు మిన్నువడ్డ.

నీదుప్రాణంబు నాలోనఁ బాదుకొల్పి
కష్టసుఖములఁ బాల్గొంచుఁ గాయమాత్ర
భిన్నతఁ జరింతు వింక జీవింపఁగలవె
ప్రేయసీ, నాదు దురవస్థ వింటివేని.

పీలిపిట్టగఱులు వెదురుముత్తెంబులు
పుట్టతేనె మేలి తట్టుపునుఁగు
చాఱపప్పు మంచిగోఱజంబును దెచ్చి
యిచ్చు వార లెవ్వ రింక నీకు.

ఏవేళకైన నేఁగొని
రావలె, గేహమునఁ బ్రొయ్యిరాఁజఁగవలయుఁ
లేవడికాపుర, మిటపై
నేవగఁ బ్రతికెదరో బిడ్డ లీవును సాధ్వి.

కురంగీకిరాతము

కడు మనసుపేద వలజడి
బడ లడరంగ వేళ కన్నుపానీయములన్
బడయక వియోగ వశమున
నొడ లెటు లోమెదవో, ధైర్యమొందుము పడంతీ.

పారములేని పెన్వెతలు పైకొనె, దుఃఖము డిగ్గఁద్రావి నీ
వూఱట సెందుటొప్పు నటులోరిమిఁ బూనవయేని నీవె యా
ధారముగాఁ మెలంగు చిఱుతల్ దిగులొంది కృశింపకుండ్రె? నీ
భారమకాదె పెంచియిఁక వారలనెట్టులొ పెద్దసేయుటల్.

కడపటి మాట సెప్పెద మృ
గవ్యవినోదమె నాకు నిట్టి పె
రడలు ఘటించెఁ గానఁ బల
లాశనముం ద్యజియించి హింసకున్
బుదుతల నెన్నఁడున్ జొనుకఁ
బోకు తదీయ హితంబు కోరుదేన్
బడఁతిరొ హింస కంటె మఱి
భైక్షము మేలని చాటి చెప్పెదన్

వినుము జీవకోట్లఁ దనుమాడు టొకఁడె
హింసయంచు నెంతువేమొ, వాని
మనను నొవ్వఁ జేయుపని యేదియైనను
హింస యగునటంచు నెఱుఁగు మబల.

తలఁప మనోవాక్కరణం
బుల భూతంబులకుఁ గ్లేశమును నేవేళ౯
గలిగింపమియె యహింసగఁ
బలుకుదురు మహాత్ములైన పరమమునీంద్రుల్

ధర్మములలోన నుత్తమధర్మ మరయఁ
దపములను నుత్తమతపంబు, దానములను
ఉత్తమంబగు దాన మీ యుర్వియందు
హింసయాట దీని మఱవకు మెన్నఁడైన.

తనయెడఁ దప్పులేకయె వృథామదుదగ్రశితాస్త్రపాళి క
గ్గమగు మృగాళిపైఁ గరుణ గల్గియు, నేనిటు లొందఁ బోవుదుః
ఖము నెఱుగంగఁ గల్గినఁగావనొ సాధులు పెక్కుకట్టి ధ
ర్మముల నెఱుంగఁ జెప్పి రవి మన్మతి కయ్యె విషంబులత్తఱి౯.

అని యిటు దారపుత్రుల నిజాగ్రమునం గనినట్లు సీతిబో
ధన మొనరించెఁ, గ్రూరపుపథంబున దుర్మనుఁడై శరీరయా
త్ర నడపినట్టి బోయ యమితవ్యథ మున్గుటగల్గ; మానవుం
డనుభవమైనయప్డె తెలియంగలఁ డొప్పును దప్పు దైవముల్.

దారుశరాల దీర్ఘోదర ఘోరబాధ
దార పుత్త్రవియోగ విస్తారబాధ
నోడలి నెడఁదను బీడింప నోపలేమి
విడిచెఁ దుదకతఁ డసువు లవ్విపినసీమ.

నాదీసౌధము, నాకళత్రమిది, సంతానంబులున్ నాది, భా
గ్యాదుల్ నావని విఱ్ఱవీఁగెడు మహాహంకారుఁడై మర్త్యుఁ, డే
ప్డేదెట్లౌనో యెవండెఱుంగు నది యట్లే? యన్న, నాబోయయే
కాదే సాక్షి సమస్తదూరుఁడగుచున్ గానన్ మృతిం బొందఁడే

పంపిన భక్తినట్లు భగవంతు నిజార్తి నడంప వేఁడు నా
శంబరి వృష్టి నిల్వఁగని శాబకముం గని కొంత బాధవో
నంబకయుగ్మముం దెఱచియాత్మ శమింప, దవాగ్నియున్ ద్రుమా
గ్రంబున బోయయున్ గనఁగ రామికి మోదమహాబ్ధిఁ దేలుచున్.

వనిఁ దల దాఁచికో రిపుఁడు వానకుఁ జెంగట నేడనైన నుం
డునో యను శంకతో నిటునటుఁ జని, శూలశిఖోగ్రదీర్ణగ
ర్భుని భయసంభ్రమంబులఁ జివుక్కురనంగ మనంబు శంబరాం
గన గనె, నట్లు తద్వికృత కాయముఁ గన్గొని చిత్రమట్టులై.

నిలిచికొంతసేపు, తలఁచె నికృష్టంపు
మరణ మిట్టు లొందు టెఱుఁగలేక
యెంత తుళ్ళినాఁడ వెన్ని సంపినవాఁడ
వెంతచేసినాఁడ వెఱుకువాఁడ.

అనుకొని పెందమందిటుల నచ్చట నొంటిగ నాయనుంగు బి
డ్డనుదిగఁబెట్టి యీడకకటా! చనుదెంచితి నంచుసంభ్రమం
బునఁ జని దానిఁ జేరె, నటుపోవుచుఁ దన్ విపదబ్ధినుండి పా
పినజగదీశుమిక్కిలి పవిత్రమతిన్ వినుతించె నీక్రియన్.

పరాత్పరా, నిజాశ్రితౌఘ పాపహర, శ్రీవరా,
వరాహరూప భంజితోగ్రభర్మదృక్నిశాచరా,
చరాచరాత్మకాఖిలోర్వి సర్గపోష సంహరా,
సురాజముఖ్యదేవసన్నుతా, లసద్గుణాకరా.

కురంజీ కిరాతము

కమనీయాత్మ పదాంబు జోద్భవ వియత్కల్లోలినీభూషిత
ప్రమథాధీశ్వరజూట, ఘోరకలుష ప్రాలేయ జాలాబ్జినీ
రమణా, సర్వవిశిష్టలోకవిహితార్థ స్వీకృతానేకరూ
ప, మనీషాధన మౌనివేద్య సుమహాత్మా, భక్తచింతామణీ.

స్మేర నిజాపాంగ ఘృణీ
వారామృత సేకమాత్ర వర్ధిత ఘనశృం
గార వ్రీడా సాత్త్విక
కారణకించిన్నతాస్య కమలా, శౌరీ.

వనజాలయాకళత్రా,
దినకర శశి నేత్రా, దేవ, దేవకి పుత్రా,
ఘనసమ నీలసుగాత్రా,
వినతాసుతపత్రా, వర పవిత్ర చరిత్రా.



సతతధ్యాత సరస్వతీపదుఁడు, రాజ ద్వేపకౌ మ్నాన్వయాం
చితపాథోధి విధుండు, సుబ్బయబుధ శ్రీతుల్యకామాంబికా
గ్రితనూసంభవుఁ, డాదిశేషుఁడు, కవీంద్రప్రీతిపాత్రుండు, శా
శ్వతమైకాల్రిల రచించె నీకృతి నహింసాతత్త్వబోధంబు గాఁ.

